# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

**16**

ఆగస్టు - అక్టోబర్ 1970

నిర్వహణ

''సాహితీ మిత్రులు''

116 పేజీలు 125 పైసలు

కవర్ డిజైన్
" చంద్ర "

ప్రతులకు, వివరాలకు :
" సృజన "
పోస్ట్‌బాక్స్ నెం. 67
వరంగల్-2 (ఆం.ప్ర)

సంవత్సర చందా : ఐదు రూపాయలు
ఈ సంచిక : రూపాయి పావల

ముద్రణ :
వెంకటరమణ ముద్రణాలయము,
వరంగల్ - 2.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

ఆగస్ట్-అక్టోబర్ 1970 త్రైమాసిక 16

## కవితలు :


| | | |
|---|---|---|
| ఝంఝ | శ్రీ శ్రీ | |
| ప్రపంచం నిండా... | చెరబండరాజు | 1 |
| మండుతున్న అడవి | నిఖిలేశ్వర్ | 3 |
| "విప్లవం ఆగదు సత్యం" | జ్వాలాముఖి | 5 |
| గానుగెద్దు | పురుషోత్తం | 29 |
| రెండు కవితలు | ఏ. బసలింగప్ప | 30 |
| ఒక అంచు కలం, ఒక అంచు కత్తి | శ్రీ భాష్యం | 31 |
| సాక్షిగా నేనక్కడే ఉంటాను | "బుజ్జి" | 32 |
| మీకు తెలియదు | టి. భానుమూర్తి | 33 |
| విప్లవిద్దాం! రా! | సి. వి. రమణ | 34 |
| చెలీ! ఇప్పటికిక గుడ్‌బై | ఎం. ఎచ్. అవారి | 36 |
| యాచించే బతుకెందుకు | "జ్వలిత్" | 38 |
| చీకట్లో సైతం కళ్ళు తెరిచి... | అమ్మంగి వేణుగోపాల్ | 39 |
| జాగ్రత్త! | మోహన్ | 50 |
| తప్పుకో! | | 57 |
| ప్లస్ అండ్ మైనస్ | గిరీశం | 67 |
| కష్టజీవి ప్రశ్నలు | ఎ. బి. కె. | 69 |
| జైళ్ళు నోళ్ళు తెరుచుకున్ననాడు | సి. వి. | 71 |
| నగరమే పులి అయినప్పుడు... | పి. వి. | 78 |
| ఉద్యోగపర్వం | యానగిరి | 80 |
| విప్లవశాసనాలు | ఎక్స్-రే | 81 |
| శాంతి? | అశోక్ | 82 |
| రైట్ టు ఓట్ కాదు | లోచన్ | 83 |
| ఆయుధాగారం | శివకుమార | 85 |

## విమర్శ - వ్యాసాలు :


| | | |
|---|---|---|
| రాముడు | రాచకొండ విశ్వనాథశాస్త్రి | 12 |
| విప్లవ రచయితల సంఘం పూర్వాపరాలు | కె. వి. రమణారెడ్డి | 14 |
| సాహిత్యంలో విప్లవోద్యమం | కొడవటిగంటి కుటుంబరావు | 23 |
| అ.ర.సం. నుంచి వి.ర.సం. వరకు | రహి | 40 |
| విప్లవ సాహిత్యం—సైద్ధాంతిక ప్రతిపాదన | శివకుమార్ | 43 |
| అంపశయ్య-మినీ విమర్శ | త్రిపురనేని మధుసూదనరావు | 45 |
| దిగంబర కవుల పరస్పర విమర్శలు ; | | 21 |
| నిజాయిజాల మంచిచెడ్డలు | అట్లూరి రంగారావు | 46 |
| అంపశయ్య-మినీ ప్రశంస | కె. వెంకటనారాయణ | 104 |


## కథలు :


| | | |
|---|---|---|
| ముమూర్ష | భమిడిపాటి అనంతనారాయణ | 57 |
| వారసుడు | "లీపారియా" | 58 |


## సమీక్షలు :


| | | |
|---|---|---|
| చితి-చింత | లక్ష్మీపతి | 91 |
| స్పందన | ఎ | 94 |
| ఐదుగురు లోఫర్లు | | 97 |
| నీలం నోట్ బుక్ | | 100 |
| లాంగ్ మార్చ్ | ఆర్. బి. ఆర్. | 102 |


## సాహిత్య లేఖ :


| | | |
|---|---|---|
| విప్లవకారుడి వీలునామా-ఫైడల్ కాస్ట్రోకు చే గువేరా రాసిన లేఖ | అను: చలసాని ప్రసాదరావు | 105 |

శ్రీ శ్రీ

# ఝంఝ

ఘోషించాను
మంచిగా ఉండండ్రా అంటూ
గోలపెట్టాను
అమాయకుల జోలికి పోకండ్రా అంటూ
కల్మషాలని మానసాలలోంచి
కడిగేసుకోండ్రా అన్నాను.
కళ్ళల్లో కాంతులు
పోగేసుకొమ్మన్నాను.
గతాన్ని నెమరేసుకోవడం
మానేసుకొమ్మన్నాను.
మొరపెట్టాను,
మొత్తుకున్నాను,
మెత్తగా బతిమాలుకున్నాను.

విన్నారు కారు.
వేలాడుతున్నారు
భూతకాలం చూరుపట్టుకొని,
విలువలకి వింత వ్యాఖ్యానాలు చేస్తున్నారు.
పాతని బతికించడానికి
కొత్తచిట్కాలు వెదుకుతున్నారు:
కొత్తని హతమార్చడానికి
పాతకత్తులు నూరుతున్నారు:
ఊరుకుంటానా నేను.

కసిగా కసాయిగా
ఉపద్రవంలాగ ఉవ్వెత్తుగాలేచి
సంహారాన్ని స్యందనంచేసి
ఉద్రేక తరంగాలే తురంగాలుగా
ఆగ్రహం కొరడాని చేబూని
సాయుధ విప్లవ బీభత్సుని సారథినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝుంఝుని ప్రసరిస్తాను
మంటలచేత మాట్లాడించి
రక్తంచేత రాగాలాపన చేయిస్తాను.

# ప్రపంచం నిండా....

ఆకాశం కింద విశాల హృదయంతో
వస్త్రహీన దేహాలతో
మండే కడుపులతో
రక్తాన్ని ఇంధనంగా మార్చి
పాలకుల రైలు ఇంజన్ని ఈడ్చుకుపోతున్న
కార్మికులం కర్షకులం నిరుపేదలం మనమే

స్నేహానికీ ప్రేమకూ చేతులందిస్తే
రోగాలూ నొప్పులూ ఆప్తులతో గోడుగోడునా చెప్పుకుంటే
మనిషికి మనిషేగా తోడునీడా అంటే
పోరాటం మినహా బతుకూ భవిష్యత్తూ అసలే లేదంటే
కంఠాలనిండా ఇనపముళ్ళు కుక్కే చట్టం
కంటిరెప్ప లెత్తితే కాల్చేస్తామంటోంది

కడలితప్ప కన్నీటిని బోధపర్చుకునేదెవరు
కడుపు బాధలకు నేల తప్ప
కరుణా ప్రేమలతో చెవియొగ్గేదెవరు

ప్రపంచం నిండా మన చేతుల్లో
ఆకలి ఆక్రందనలెత్తించిన పతాకాలు
ఒకే లక్ష్యసాధనకై
ఒకే ధర్మ స్థాపనకై
మానవతా సంకేతాలై
మంటల్లో పడి లేచీ
వానల్లో నాని ఎండి
తుఫానుల్ని అడ్డుకొనీ

భూగోళం గుండెపైన
అవిగవిగో అవిగవిగో అనవరతం ఎగిరేను
మరికొంచెం మరికొంచెం మరికొంచెం
సరిహద్దులు అధిగమించి
శ్రామికరాజ్య సందేశాన్ని వినిపిస్తున్నాయ్
మనం హరిజనులం గిరిజనులం
అనాగరికులం అడవిమనుషులం
నీగ్రోలం బానిసలం

కాయకష్టంచేసి కనాకష్టంగా బతికేవాళ్ళం
అన్నానికీ ఆనందానికీ
కౌటుంబిక అనుబంధానికీ
సభ్యతకూ సంఘంలో
సమానత్వ హక్కులకూ
అనర్హులం భయస్థులం
నోరులేని జీవులం

జైళ్ళూ కోర్టులు చట్టాలు సంకెళ్ళూ పోలీసుల బయినెట్లూ
అవునవునూ
మన శాంతికి మన భావికి
మన జీవిత సౌఖ్యానికి

అర్ధరాత్రి రేడియో విప్పండి
ఏ ఉదయమైనా వార్తాపత్రిక తిప్పండి

పొలాల్లో అడవుల్లో
ఫ్యాక్టరీల సమ్మెల్లో
చంపబడ్డ రాక్షసులం
రాజద్రోహులం హంతకులం
ఉరికంబంఎక్కేవాళ్ళం అంతా మనమే

అరో పరకో అటో యిటో
మన నేరాలన్నీ ఒకే సెక్షనుకిందికొస్తాయి
అందుకే
దారితప్పిన సోదరులందరిదీ ఒకేదారి.

—చెరబండరాజు.

# మండుతున్న అడవి

మండుతున్న అడవులు
పిలుస్తున్నాయి నగరాలను
పారుతున్న మంటలు
కాలుస్తున్నాయి బంధనాలను
తరతరాలుగా అప్పులో పుట్టి
వడ్డీతో పెరిగి
అసలుతో అసవాలు మాసి
బానిసలుగాతప్ప జీవించలేని
నికృష్ట జీవితాల చేతుల్లో మంటలు.

మహానగరాలుగా వ్యాపించి
వేనవేల నాలుకలు చాచి
దోచుకునే అడవుల్ని వదలి
మండుతున్న అడవులచుట్టూ తుపాకులు,
చెట్టు చెట్టుకు
గుట్ట గుట్టకు ఎగిసే
మానవుల మంటలను
అరికట్టే విఫలయత్నంలో
అధికారం తొత్తులు.

భజన సంఘాల తిత్తులు నిండిన
ఉపన్యాసాల-కీర్తనల అజ్ఞానంలో
మనిషిని రాయికి - రంకుకు
ఎత్తైన గోడలకు భక్తుడిగా మార్చిన
గుడి గర్భాలయాల నేతినై వేద్యాలలో
రేగిన మూలవిరాట్టు వస్త్రాల దహనంలో
భస్మమై గోలపెడుతున్న గీత గోవిందుడు,
కత్తులతో కండ్లు పెరికి
ఎడారుల్లో దాహాన్ని పెంచుతున్న కురాన్ ప్రవక్త
దేశాలనే తినేస్తున్న బైబిలు పఠనం
క్రీస్తు సిలువలోని మేకులను
ప్రపంచమంతా పరుస్తున్న అగ్రదేశాలు.

ఇంక వద్దు
ఇంక మంటలు ఊరుకోవు
మతగ్రంథాల మౌఢ్యాన్ని మంటపెట్టి
వాటికన్ ప్రభుత్వాల
శంకరాచార్యుని పీఠాల
మస్జీదుల కామందుల
కావరాన్ని కరిగించి
దిక్కులేని దీనుల ఇళ్ళల్లో
వెలిగిస్తాయి
ఏనాటికీ ఆరిపోని దీపాలను

నగరాలలో సాగుతోంది
నరాల పోరాటం
చుట్టుముడుతున్నాయి అడవులు
అనుమానాలతో జీవించే నగరాలను,

రోగికి బలవంతంగా పడుతున్న
మురిగిన మహాత్ముని మందును
వాంతిచేసుకొంటున్నాయి నగరాలు,

శాశ్వతంగా మ్యూజియమ్‌లలోకి
ఎగిరిపోడానికి అంతిమయత్నంలో
కర్ర ఆడిస్తున్న విగ్రహాలు
అడుగడుగునా మట్టిలో
కొట్టుకుంటున్నాయి
కేలండర్‌లకెక్కి
చిరిగిపోయిన సూక్తులు.
చుట్టూ ఉధృతంగా వీస్తోంది
రాజీపడని జ్వాలల గాలి.

— నిఖిలేశ్వర్.

## 'విప్లవం ఆగదు సత్యం'

రాత్రి
విప్పుకున్న భయభీతావహం
క్రూరంగా కురుస్తూన్న దోపిడి
పామరులను చీకట్ల పోట్లతో
వేధిస్తున్న స్వతంత్ర రాత్రి
అమానుష ప్రజాస్వామి
అతిభయంకర మర్యాదా పురుషోత్తముడు
రాత్రి పరిపాలన
చీకటి బలగాల పీడన
ఉదయం రాకుండా
ఊరంతా కాపలా
పామరులు
శ్రమజీవులు
ఆకలి సంచారులు

బతుకులేదు
తెరువులేదు
నిలకడలేదు
నిలువ నీడలేదు
కాలినడక ఆగలేదు
కాయకష్టం మాసలేదు
ఆశల చీమల బారుల
అనంత ఆకలి యాత్ర
కాళరాత్రి చీకటి వరదలు
తలదాచుకోవడానికి పరుగులు
మధ్య మధ్య మజిలీలు
ఐదడుగులకోసారి
దోపిడీ గుడారాలు
విలాస సభాసంరంభాలు
కసురుతూన్న శాసన జాగిలాలు
వెంటాడుతూన్న రాత్రి సేసలు
మిగిలినవి
కన్నీటి పరంపరలు
నిట్టూర్పుల తరాలు
ఆరని ఆకలి
తీరని దాహం
దట్టమౌతూన్న చీకటిలో
రగిలిన ఆక్రందనలో
ఎదురొచ్చిన కాగడాతో
పామర పాంథుల ప్రశ్న—
—"బతుకు తెరువు బాటసారులం
ఆకలితో అలసిన ప్రాణాలం
అనంత శ్రమజీవన యాత్రికులం
కటికచీకటి కోటలో బతుకుచెడిన బానిసలం
విముక్తిమార్గం కావాలి?
మాబతుకుల గమ్యస్థానం ఎక్కడ?"

—"మీరు వదలి వచ్చిన గూడెం
మీరు చేరవలసిన చలివేందిర
మిమ్మల్ని తరిమేసిన చీకటి స్వాములు
మీ ఆశల నమిలేసిన అనాది శత్రువులు
తిరగబడి పోరాడండి
గత్యంతరంలేదు
లేకుంటే గమ్యంలేదు
ఎంత నడచినా
రాత్రి ఆవలి తీరంరాదు
పోయిన చోటల్లా చీకటికోట
ఇక్కడ అనంతమైన కాళరాత్రి
ఇది భయంకర దోపిడీ ధృవం
చీకటిసామ్రాజ్యం యధేచ్ఛగాసాగుతూంది.
దీన్ని క్రాంతి గునపాలతో కూల్చాలి.
ఉదయం దానంతటదేరాదు
చుక్కలన్నీ ఒక్కటై పోరాడుతాయి
తూట్లుపడ్డ రాత్రి
ఉదయ సంధ్యలో ఊపిరొదులుతుంది
అప్పుడే ప్రభాతం వెలుగుతుంది.—"

—"ఎవరుమీరు?
ఏ యుద్ధంలో క్షతగాత్రులు?
ఆ నెత్తురు కాల్వలేమిటి?
ఏ సేనలో సిపాయీవి?
మిగతా వారేరి?
మీ విజయం సంగతేమైంది?
మీ వూరు పేరేమి?

—"మనదంతా ఒకేవూరు
మనదంతా చీకటి మండలం అంతేవాసులం
సస్యశ్యామల బహిష్కృతులం
ప్రపంచ దేశంలో మనదొక కుగ్రామం

వెలుగు చూడని గుడ్లగూబలు
బతుకుల్ని తలకిందుల తూచే గబ్బిలాలు
మన గ్రామదేవతలు
ప్రపంచ చీకటి ప్రతినిధి
మన గ్రామ మునసబు
మన గ్రామ పంచాయితీ
చిక్కని చీకటి మండలం
వెలుగు రానీయకుండా
ఏకగ్రీవ జాతీయ తీర్మానం—
ఎర్రలాంతరు పట్టుకొని
పంచాయితీలో ప్రవేశించి
చీకటి భగ్నం చేయదలచిన
సోదర శూరులంతా
ఎర్రలాంతరు బద్దలుకొట్టి
చీకటి చీర కుచ్చిళ్ళు సవరిస్తున్నారు
పామరుల క్రాంతిదాహం తాకట్టు పెట్టారు
పడుపుకూడుతో పొట్ట నిమురుకుంటున్నారు.

చిరిగిన విస్తరాకులు మన బతుకులు
విందు భోజనంమెక్కి పారేశారు చీకటి దొరలు
ఎంగిలాకులమై పెంటలనిండా ఎగురుతున్నాం
అధికారం కుక్కలు వెంటాడుతున్నాయి
చెట్టుకొకరం గుట్టకొకరం చెదిరిపోయాం
మాదంతా ఆకలి కొండల ఆదివాసుల ప్రాంతం
ఇరులగిరుల్లో వెలుగు మంటలు మండిస్తున్నాం
రాత్రి స్వాములతో సమరం సాగిస్తున్నాం

నావాళ్ళు
ఆకలిగొన్నవాళ్ళు
అన్యాయం వాతబడ్డవాళ్ళు
అంధకారం అసహ్యించుకునేవాళ్ళు

దీర్ఘ విముక్తి యుద్ధం రగిలిస్తున్నారు
ఆ త్యాగధనులంతా
నిర్మల నక్షత్రాలు
సంపూర్ణ మానవతా మూర్తులు
చీకటిని ఛేదిస్తున్న రాత్రి భాస్కరులు
పామర గణాలను పదిల పరుస్తున్న గణపతులు
క్రాంతి పాణిగ్రహణానికి
పరితపించిన విప్లవ శ్రామికగీతాలు
కష్టజీవుల కైలాసాలు
అన్నార్తుల అంగరక్షకులు
గిరిజన క్రాంతి కేసరులు
సమతా సుందరతేజేశ్వరులు
కొందరప్పుడే వెలిగి రాలిపోయారు
కొందరింకా చీకటిని చీలుస్తున్నారు
లక్ష నక్షత్రాలు రాలందే
ఉజ్వల ఉదయం ప్రవహించదు
రాలిన నిర్మల నక్షత్రకాంతులే
రేపటి సూర్యోదయ కిరణాలు
నేటి నిర్మల త్యాగాలు
రేపటి తూరుపు సౌరభాలు
అదిగో అటుచూడండి
అవీరవిహారాలు కనండి
రణన్నినాదాలు వినండి
తూరుపు కొండలు మండుతున్నాయి
చీకటి చావుతెలివి కదంతొక్కుతూంది
రాత్రి రూపం పగులుతూంది
ఆకాశం ఎర్రబడుతూంది
రాత్రి ఉదయాల సమరం సాగుతూంది
కాళరాత్రి విషసర్పాన్ని
జ్వలిత నక్షత్రాలు ఛేదించాయి
రాత్రి ఉరగం నెత్తురు వాంతులు చేసుకుంటూంది

ఉజ్వల ఉదయం ఉధృతంగా రాబోతూంది
మీరంతా మిగిలిన నక్షత్రాలతో చేరండి
తూరుపు ఎరుపు హోరుకోసం
నిర్మల నక్షత్రాలై పోరాడండి
వెళ్తాను శెలవు
విజయం మనకు తప్పదు
విప్లవాలు సుదీర్ఘ సాయుధ ప్రయాణాలు
చీకటితో పోరాటం ఆపవద్దు
రాత్రితో రాజీలేకపోవడమే తిరుగుబాటు
ఉజ్వల ఉదయానికి ఎడతెగని పోరాటమే విప్లవం
శ్రామిక సమరంలో క్షతగాత్రుణ్ణి
నా నెత్తురు కాల్వలు
యువతరానికి స్వాగత సంగీతాలు
నేను శ్రామికలోకం సిపాయిని
విప్లవ ఆహ్వానంతో వెళ్తున్నాను
నాపాత్ర ముగిసింది
నేను సత్యం
మీరు సత్యం
నా మరణం అసత్యం
విప్లవం నిష్క్రమించదు
రాత్రి నశిస్తుంది
ఉదయం ఉజ్వలంగా వస్తుంది
మంచిచెడుల పోరాట పరిణామం ఇది
నా కాగడా అందుకోండి
ఊరి చీకటంతా కాల్చివేయండి
మీ గ్రామం మీరు ఏలుకోండి.''

-''మనకు కాగడా విముక్తి మార్గం చూపింది
శ్రామిక శాశ్వత సత్యం వెలిగింది
విప్లవ ఇంధనాలు వాళ్ళు
చరిత్ర దీప్తతారలు
రాత్రి సాయుధ వీరులు

ఉజ్వల ఉదయానికి దారులు
శ్రామికవిజయానికి విప్లవకారులు
విప్లవకారుల వీరనిష్క్రమణానికి
మానవచరిత్ర
విప్లవాభివందనలు చెబుతుంది.-
పదండి పోరాడుదాం
ఉజ్వల ఉదయానికి
నక్షత్రాలవంతెన వేద్దాం-"-

వేగుచుక్క రాలింది సత్యం
పొద్దు పొడుస్తుంది తథ్యం
సమతా సూర్యోదయం నిత్యం
విప్లవం ఆగదు సత్యం.

—జ్వాలాముఖి.

---

రక్తంలో మొలచిన రత్నాలను
ముచ్చెమటల్లో పూచిన ముత్యాలను
దోచుకునే పిండారీ!
అరల్లో
దాచుకునే బేహారీ!
నీకు తెలియదు వాటి విలువ.
నీకు తెలియదు ఆ
నెత్తుటి మంటల్లో
నిద్రించే కన్నీటి చలువ.

—డాక్టరు సి. నారాయణరెడ్డి

# రాముడు

"విప్లవం" అనే మాట ఎక్కడ వినిపిస్తే అక్కడ తుపాకీలు పేలడానికి సిద్ధంగా ఉన్నాయని అందరికీ తెలిసిన విషయమే. ఎవరైతే ఎల్లప్పుడూ తుపాకులు పట్టుకు తిరుగుతారో వారు అహింసావాదులు కారనేది స్పష్టమే అయినట్లయితే మన "ప్రభుత్వంవారు" అహింసావాదులు కారనేది స్పష్టమేకదా. అయితే—

ఏది సాధించాలన్నా అది దండోపాయంవల్లనే సాధించాలని మన ప్రభుత్వం లాంటివారు తప్ప మరెవరూ కోరరని నేననుకుంటాను. (మన ప్రభుత్వం అయినా, మన దేశంలోని చిన్నలమీద దండెత్తుతుంది. పైదేశాల పెద్దల దగ్గర ముష్టెత్తుతుంది.) అయితే, ఏ శత్రువుతో ఏ విధంగా పోరాడాలన్నది ఆ శత్రువే నిర్ణయిస్తాడని నేను నాముందు వారి అనుభవంవల్ల తెలుసుకున్నాను.

భారత దేశం బ్రిటిషువారి బంధాలనుండి బైటపడడం, అది న్యాయం అయితే, అది ఏవిధంగా సాధించాలి? సాయుధ పోరాటంద్వారానా? లేక అహింసా మార్గం ద్వారానా?

అని ప్రశ్నిస్తే,

"అది బ్రిటిషువారే నిర్దేశించవలసి ఉంటుంది కాని మనం కాదుకదా!" అని ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు గాంధీగారితో అనాడెప్పుడో అన్నారట. అంతేకాదు—

సబువుకి కట్టుబడే శత్రువుని -బలిచక్రవర్తిని- పోరాటం అవసరం లేకుండానే అధఃపాతాళానికి అణిచేసిన మహావిష్ణువు రక్తపాతంలేకుండా హిరణ్యకశిపుణ్ని అణిచేయలేకపోయేడుకదా అనికూడా గాంధీగారితో గోపాలకృష్ణయ్యగారు అన్నారుట, అలా ఆయన అన్నప్పటినుంచీకూడా ఆయనంటే గాంధీగారికి కొంచెం పక్కబెదురుండేదని ఆ కాలపు పెద్దమనిషొకరు నాతో చెప్పేరు.

ఆంధ్ర రత్నం చెప్పినదానికి చరిత్రలో చాలా దాఖలాలు కనిపిస్తాయని నేనను కుంటాను. ఉదాహరణకి, మనంకూడా ఆయనలాగే, భగవంతుణ్నే తీసుకుందాం.

మనిషిగా మారిన భగవంతునికంటే మనుష్యుల్లో మరెవ్వరూ ఎక్కువ్వారుండరు కదా. భగవంతుడు భూమ్మీదికి రాముడిగా దిగకుండానే రావణబ్రహ్మలో మానసిక పరివర్తన మంచికోసం తెచ్చేస్తే ఎంతబావుండును! కాని అంతటివాడుకూడా ధర్మస్థాపనకోసం రఘురాముడిగా రంగంలోకి దిగవలసి వచ్చింది. దిగేక, ఆయన ఆ రావణుణ్ని అడిగిందేమిటి? రావణాసురుణ్ని మానం, ప్రాణం ఇచ్చేయమన్నాడా? అతగాడి రాజ్యం అడిగేడా? అతగాడి అంతఃపురంలోని ఆడవార్ని ఇమ్మని అడిగేడా? దేశంలోని ధాన్యరాసులన్నీ ఇచ్చి తీరాలన్నాడా? బొక్కసంలోని బంగారంఅంతా ఇచ్చేస్తే కాని వీల్లేదన్నాడా? రాముడవేవి అడగనే అడగలేదు. "బాబోరే! నా పెళ్లాన్ని నాకిచ్చెయ్యిరా బాబు!" అని అంతమాత్రం అడిగేడాయన. అంతే అడిగేడు. అతను దేముడే. యుద్ధం జరిగితేనేకాని దేముడిభార్య దేముడికి దక్కిందికాదు.

అందుచేత—

విప్లవాలూ యుద్ధాలూ లేకుండా లోకంలో న్యాయం జరిగిపోతే దేముడికికాని, మనకీకాని అంతకంటె కావలసిందేముంది? దేశంలోని రావణబ్రహ్మలంతా పేదల సీతల్ని పేదలకి అప్పజెప్పేస్తే అంతా బాగానే ఉంటుంది. నా గుండెలమీద కూర్చున్న పెద్దపులి, మనసు మార్చుకుని, సన్యాసం పుచ్చుకొని, కమండలం పట్టుకొని, తావళం తిప్పుకొని వాయుభక్షణచేసుకుంటూ హరినామ సంకీర్తనలో కాలం గడుపుకుంటే దానికీ నాకూ పేచీవేలేదు. దిక్కుపోతేనే పేచీ.

ఇది చదివిన నా స్నేహితులు ఒకాయన చిరునవ్వునవ్వి, "మీ గుండెలమీద కూర్చున్నది పెద్దపులి కాబట్టి మారదు; కాని ఆ కూర్చున్నది మనిషైతే మారొచ్చు కదా" అన్నారు. అప్పుడు నా వంతు ప్రకారం నేను చిరునవ్వునవ్వి, "వాడే మనిషైతే అలా కూర్చోనే కూర్చోడుకదా!" అన్నాను.

— రాచకొండ విశ్వనాథశాస్త్రి.

# విప్లవ రచయితల సంఘం పూర్వాపరాలు

"సంస్కరణవాదానికి కాలం చెల్లిపోయింది. సాంస్కృతిక వ్యవహారాల్లో నిస్తబ్ధత పేరుకొనిఉంది. అభ్యుదయ రచయితల ఉద్యమంకూడా శవప్రాయమైపోయింది. ఈ దుస్థితిని తొలగించుకొని జాతిని సమగ్ర విమోచనంవైపు నడిపించేందుకు విప్లవ రచయితల సంఘం ఏర్పడుతున్నది."

1970 జులై 4 నాటి సూర్యుడు పశ్చిమార్ధగోళాన్నింకా విడిచిపెట్టలేదు. పూర్వార్ధగోళం ఇంకా చిమ్మచీకటిచెరలో చిక్కి నానాహింసలకూ బాధలకూ గురౌతూఉంది. అలాంటి నిశిరాత్రివేళ హైదరాబాదునగరంలోని ఒకానొక హోటెలుగదిలో క్రిక్కిరిసిన యువరచయితలు ఒక ప్రకటన చేశారు. అందులోని భాగమే పైదిది. అది క్షేత్రారవమే. సందేహంలేదు.

ఉదయసూర్యుడు అభ్యుదయ సాహిత్య సదస్సుపేర ప్రభు ప్రాపకంతోటి జరుగనున్న అభ్యుదయ సాహిత్య సంప్రదాయ దుర్వ్యధకు సాక్షికాకముందే ఈప్రకటన విడుదలై వీధుల్లోకి వచ్చిపడింది. ఘరానా హోటెలు గోడలమీదికెక్కింది. సర్కార్ సాహిత్య సదస్సుకు ఆహూతులైన పెద్దమనుషుల చేతులకు నిప్పుకణికలా తగిలింది. రాసభ ప్రాంగణంలో అలజడి కలిగించింది. కుట్రమీది ముసుగును చీల్చి దాని నిజస్వరూపాన్ని ప్రదర్శించింది. నానాపత్రికలకూ ఇంత నిండైన దాణా పడవేసింది. విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది!

అర్ధరాత్రి ముహూర్తమే దొరికిందా ఈ అవిర్భూతికి? చీకటి తెరచాటుచేసుకొనిగానీ ఇది చరించలేకపోయిందా? సిగ్గు వల్లనో తప్పుచేస్తున్నామనే భావంవల్లనో ముఖం చాటుజేసుకోవలసి వచ్చిందా ఈ సంఘస్థాపకులకు? ఇలా ప్రశ్నించేవాళ్లు వెర్రిమాలోకాలైనాకావాలి, లేదా పచ్చి కపటులైనాకావాలి. ఎందుకంటే, విప్లవ రచయితల సంఘం ముందు హెచ్చరిక ఇవ్వకుండానే బాంబులాడూకి పడలేదు. కళ్లూ చెవులూ సరిగా పనిచేస్తూ ఉన్నవాళ్లకు కొన్ని మాసాలుగా ఈ పరిణామంగురించిన సూచనలు అందుతూనే ఉండాలి.

అభ్యుదయ రచయితల సంఘం ఎత్తుబడిపోయి ఎన్నోఏళ్ళయింది. మాట్లువేసే ప్రయత్నాలన్నీ ఫలించకుండా పోయాయి. ఈ చిల్లికుండలో ఏ నీరూ నిలవలేదు, కొత్త నీరు దీని చాయలకేరాలేదు. చరిత్ర తొక్కసాగిన కొత్తపుంతను ఇది పట్టించుకోలేదు. స్వాతంత్ర్యోద్యమ మధ్యకాలంలో, నెహ్రూమార్కు సోషలిజానికి యువశక్తుల కళ్ళు భ్రమిసినవేళ, సీమచదువులకు వెళ్లి ఉండిన కలవారింటి దొరబిడ్డలు యూరపులో 'పాపులర్‌ఫ్రంట్' దశలో సాహిత్యరంగాన దూరివచ్చిన కల్తీసోషలిస్టుభావాలను తలకెక్కించుకొనివచ్చి లక్నో కాంగ్రెసు మహాసభాప్రాంగణంలోనే ప్రేమ్‌చంద్, సరోజినీ నాయుడువంటి జాతీయవాదుల ఆశీస్సులతో అభ్యుదయ రచయితల సంఘాన్ని స్థాపించారు. రెండవ ప్రపంచయుద్ధ మధ్యకాలానికిగాని అది ఆంధ్రదేశానికి చేరుకోలేకపోయింది. కమ్యూనిస్టుపార్టీ పెంపకంలో అది అచిరకాలంలోనే పెరిగి పెద్దదైంది. యుద్ధకాలంలో అటూ ఇటూ మారిపోసాగిన కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంతాలను సాహిత్యరంగంలో ప్రతిబింబిస్తూ, సామ్రాజ్యవాద వ్యతిరేకత ధ్వజచ్ఛాయల్లో ఇది నానాగోత్రీకులనూ కూడగట్టగలిగింది. "విశాలమైన ప్రాతిపదిక" అనే ఆత్మవంచనపూర్వకమైన నినాదంతోటి త్వరలోనే ఇది వర్గదృక్పథాన్నీ, మార్క్సిస్టు అవగాహననూ జాతీయవాదంతోటీ సంప్రదాయపరత్వంతోటీ అనుబంధించివేసింది. తనకు వచ్చిన వాపంతా బలుపనే అనుకొంది. 1955 నాటికిగాని తన బలమెంతో తనకు తెలిసిరాలేదు.

సంస్థగా అభ్యుదయ రచయితల సంఘం మీదూకిందూ అవుతున్న ఈకాలంలోనే (1943-1955), ఒక సాహిత్యపై ఖరిగా తెలుగు రచయితలను చాలాబలంగా తనపై పుకు మరల్చుకోగలిగింది. వాస్తవ వాదం రచనలలో బాగా చోటుచేసుకొంది. కవిత్వం ప్రజల పోరాటాలకు అంకితమైంది. భావకవిత్వపు మత్తువదిలేలా సాహిత్యమూ జీవితమూ పెనవేసుకుపోయాయి. కొత్త రచయితలలో ఎక్కువమంది ఇటేరాసాగారు. ఇలా అభ్యుదయ రచనా సంప్రదాయం ఒకటి విశిష్టంగా తెలుగులో ఏర్పాటై, బలీయమైన సాహిత్య ప్రభావంగా పరిణమించింది. సంఘసభ్యులుకాని రచయితలుగూడా ఈ ప్రభావానికి లోనయ్యారు. ప్రతి కొత్త ధోరణినీ అభ్యుదయధోరణిఅనడం పరిపాటి అయింది. సామ్యవాదులూ, జాతీయవాదులూ; వాస్తవవాదులూ, ఆదర్శవాదులూ; ప్రయోగపరులూ, సంప్రదాయపరులూ; అంతర్జాతీయవాదులూ, జాతీయవాదులూ— ఎలాంటి విచక్షణాలేకుండా అభ్యుదయ రచయితలనిపించుకోగలిగారు.

1955 తదనంతరం దేశజీవితంలో వచ్చిన మార్పులూ సాహిత్యంలో తలెత్తిన కొత్త ధోరణులూ, అభ్యుదయ రచయితల సంఘంలో ప్రతిబింబించలేదు దాని ప్రణాళిక వేసినచోటనే ఉండిపోయింది. దాన్నిమార్చి నూతనకాలావసరాలకు అనుగుణంగా

మార్చే ప్రయత్నాలమీద ఇన్ని చన్నీళ్లు కుమ్మరించడమే జరుగుతూవచ్చింది. కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికలు తలెత్తాక, ప్రభుత్వం వత్తాసుతో భారీయెత్తున మేళాల స్థాయిలో అట్టహాసంగా ఆర్భాటంగా జరుగుతూ వస్తున్న ఇస్కస్ మహాసభల్లాగే అభ్యుదయ రచయితల మహాసభకూడా జరుపుకోవాలనే తహతహ, ముఖ్యబాధ్యులలో కనిపించసాగింది.

ఈలోపల దేశం, కాలం కొత్తనవాళ్లను విసిరి, రచయితలలోకూడా అపూర్వమైన ధోరణులను కలిగించాయి. ఎన్నిక మన్నికలకూ, ఓటు సీటు బేరసారాలకూ, శాసనసభా ప్రధాన కార్యక్రమలకూ అంకితమై, ప్రజల అసంసిద్ధత పేరిట విప్లవకార్యాచరణను మాటలతో దాటవేస్తూ, సిద్ధాంత యుద్ధాలతోచే శక్తియుక్తులను వ్యయపరచుకొంటూ, ప్రజలను ఉత్తేజపరచి సంఘటితంచేసే ఆలోచనలేకుండా ఉండిపోయిన కమ్యూనిస్టు పార్టీతోటి ముఖ్యంగా యువకులు విసుగెత్తిపోయారు. ఓపిక తగ్గింది. ఆరాటం హెచ్చింది. ఇటీవలికాలానఉన్న ఒక్క ప్రజాపోరాటమైన గిరిజన ఉద్యమం మీద అభినివేశం పెరిగింది. ఆ ఉద్యమానికి అండదండలిచ్చే ఉద్దేశంతో వివిధప్రాంతాలలో జరగసాగిన దాడులగురించి సానుభూతి కలిగింది. దీనికి యువకులను నిందించి లాభంలేదు. మార్క్సిస్టు అవగాహన తమ వంటింటికుందేలు లెమ్మనుకొనే వైఖరి కమ్యూనిస్టు పార్టీలకు ఉన్నంతసేపూ, యువజనాందోళనగానీ వారి వ్యగ్ర మనస్కతగానీ వేరేదారి చూచుకొంటుంది. తప్పు ఆ పార్టీలది. విప్లవానికి అనుకూలించగల సాంఘిక శక్తులనన్నిటినీ, అందులోనూ యువశక్తిని, ఎప్పటికప్పుడు తమవైపుకు ఆకర్షించుకుని, ఆ పదార్థానికి అంటుకొని ఉండకతప్పని మురికినీ మైలనూ తొలగించి మెరుగుచేసుకొనేస్థితిలో అవి ప్రస్తుతం లేవు. ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభసమయానికీ ఈ నిశ్శక్త, నిస్తబ్దసమయానికీ ఉన్న ముఖ్యమైన భేదం ఇదే. పార్లమెంటరీ కార్యక్రమంతప్ప తక్కిన ప్రయోజనకరమైన పనులకు పూనికచెయ్యలేని దుస్థితిలోఉన్న కమ్యూనిస్టుపార్టీలు, ఫ్రాన్సుదేశంలోలాగా విద్యార్థి, యువజన, యువకార్మికశక్తులు ప్రారంభించి చాలావరకు విజయవంతంగా నిర్వహించిన మహోద్యమాలు విప్లవలక్ష్యం చేరకుండా అడ్డుదగిలిన సన్నివేశాలనుబట్టి, విప్లవ వ్యతిరేకశక్తులుగా పర్యవసిస్తాయేమోనన్న భయసంశయాలు యువకులకు లేవని చెప్పలేను.

అంతేగాదు. ఆరుద్రగారి మాటల్లో 1955 తర్వాత తెలుగు సాహిత్యంలో రాజకీయాల ప్రభావానికి "దింపుడుకళ్లాం" ఆశలుకూడా తీరిపోయాయని అభ్యుదయోద్యమ విరోధులు చంకలు గుద్దుకొంటూ వచ్చిన కాలం ఇది. సిద్ధాంతాల ప్రభావానికి తిలక్ కవిత్వం భరతవాక్యం పలికిందనికూడా చెప్పి ఇంకొకరు సంతోషించారు.

మార్క్సిజానికి కాలదోషంపట్టిందన్నారు మరికొందరు. మానవతావాదం పై మెట్టని చూపారు ఇంకా కొందరు. ఇంకా మార్క్సిజాన్ని పట్టుకు వేలాడుతున్నాడని శ్రీశ్రీని తప్పుపట్టి, ఆ గుప్పిటినుండి బయటపడి స్వేచ్ఛ సంపాదించుకొన్నందుకు ఆరుద్రనూ సోమసుందర్‌నూ అభినందించిన ప్రబుద్ధులుకూడా ఉన్నారు. గోముఖ వ్యాఘ్రాలుకొన్ని శ్రీశ్రీ ఒక్క చేతిమీద నెలకొల్పి నిర్వహించిన ప్రచండ విప్లవ సాహిత్య సంప్రదాయాన్ని పౌరాణిక ఐతిహాసిక సంప్రదాయంతోటి ముడివేస్తూ ఆత్మసంతృప్తి పొంద సాగారు. అభ్యుదయ రచనకు ప్రాణపదార్థమైన మార్క్సిస్టు అవగాహనకు యిలా తలోవైపునుంచీ ప్రమాదాలు ముసురుకువస్తున్నప్పుడు, అభ్యుదయ రచయితలసంఘం గానీ, "అభ్యుదయం" అంటే విశాలార్థాన్ని మాత్రమే చెబుతూ నన్నయ్య, తిక్కన, వేమన్న, కందుకూరి, గురజాడ, గిడుగులతో నేటి అభ్యుదయ సాహిత్యాన్ని అనుసంధానిస్తూ, చివరకు ప్రేమైక పరాయణమైన, శృంగారైక మగ్నమైన కాల్పనికవాద కవిత్వాన్నికూడా చేరబిలిచి బుజంచరిచి అందులోనూ అభ్యుదయాంశను దర్శించే పార్టీ వ్యాఖ్యాతలుగానీ ఒరగబెట్టిందేమిటి?

పైపెచ్చు "కమ్యూనిస్టు" పత్రికలలో శ్రీశ్రీ, కుటుంబరావుగార్ల నేటి అభిప్రాయాలమీదనేగాకుండా వాళ్ళ అక్షర సంపదమీదకూడా మూకుమ్మడి దాడి చేయడం ఉద్దేశరహితమేమీకాదు. రాజకీయ వ్యూహంలో ఇదొక అంశం మాత్రమే. మహాజర్లకూ మహావిజ్ఞాపన పత్ర సమర్పణలకూ రాజకీయోద్యమాలను దిగజార్చి, పాలకవర్గంచేసే చట్టాలలో అక్షరాల సవరణలు ప్రతిపాదించడంతోటి ఘనకార్యం ఏదోచేసి సాధించామని అల్పసంతృప్తి పొంది, "నిర్మాణాత్మక"మైన తోడ్పాటులాంటి నినాదాలతో పాలకవర్గాన్ని గద్దెమీద ఉంచేందుకు తోడ్పడుతూ, రాజకీయాలను రంకువేషాలుగా మార్చిన "విప్లవ"పూర్వసువాసినులే, అభ్యుదయ సాహిత్యోద్యమదురంతానికి బాధ్యులు, అభ్యుదయ రచనా సంప్రదాయంపట్ల అశేషగౌరవం కలిగిన రచయితలే, ఆసంఘాన్ని విడిచిపోవలసిన పరిస్థితిని కలిగించినందుకైనా ఈరాజకీయ కపటనాటక సూత్రధారులను అభినందించాలి. పరోక్షంగా, అసంకల్పితంగా, విప్లవరచయితల సంఘానికి వీళ్లు అనుకూల పరిస్థితులు కల్పించారు.

## 2

"తెలుగు సాహిత్యం అభ్యుదయ రచనలదశ దాటిపోయింది." అని శ్రీశ్రీ ఒక్కడే అంటే, పైత్యవికారంవల్లనో ఆత్మసమర్థనకోసమూ అన్నాడు కాబోలని చెప్పేవాళ్లు ఎందరైనా ఉంటారు. నిజానికిగూడా "అభ్యుదయ" రచనలదశ

ఇకనుంచి నిన్నటిదే. కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) కార్యదర్శి, శ్రీ మోటూరి హనుమంతరావుగారు తమ "ప్రజాశక్తి వ్యాసక్రమంలో (16-7-70) ఒక మాట అంటున్నారు.

"మానవసమాజంలో ఉద్భవించిన ఆశయాలలోకల్లా మహోన్నతమైనఆశయం మార్క్సిజం. ఆ ఆశయానికి అంకితమైనవాడు మార్క్సిస్టు. మార్క్సిస్టు అయిన వాడెవ్వడూ, అతడు రచయితో కవో అయితే, అభ్యుదయకవీ రచయితా కాకుండా వుండలేడు. అలాగే ఆ మహోన్నత ఆశయానికి వ్యతిరేక కంకణం కట్టుకున్న కమ్యూనిస్టువ్యతిరేకి ఎవ్వడూ వాడి జీవితంలో మంచి సంస్కర్త, అభ్యుదయరచయిత కాజాలడు... అభ్యుదయపంథా పట్టడం ఆరంభదశ. దాని ఉన్నతదశ మార్క్సిజం"

ఈ సూత్రీకరణతో (విడిచిపెట్టిన కావ్యాలతో మాత్రంకాదు.) నామట్టుకు నాకు అభిప్రాయం భేదంలేదు. అభ్యుదయ రచయితల సంఘం యెన్నడూ మార్క్సిజం పట్ల తన విధేయత గురించి బాహాటంగా చెప్పలేదు సరిగదా, ఆ మాట వాడినందుచేత పదిమందికీ తాను భయంకొల్పుతానేమోఅని ముందుగా తానే భయపడింది. బిడియపడింది. ఇటీవల సెవెన్‌స్టార్స్ సిండికేటువారిచేత అచ్చువేయించిన పత్రాన్నిచూస్తే, అభ్యుదయ రచయితల సంఘ ప్రణాళికకుగల పరిమితులు తెలిసివస్తాయి. "లిబరల్" భావాలుగల ఏ సాహిత్యసంస్థఅయినా తన పరువు ప్రతిష్ఠలకు భంగంరానివిధంగా ప్రకటించగలిగిన ఆశయాలే అందులో ఉన్నాయి. ప్రపంచశాంతి, అంతర్జాతీయ సంఘటన, సర్వతోముఖమైన జాతీయాభివృద్ధి, కార్మిక జనశ్రేయస్సు, స్త్రీజనవిమోచన, సోషలిస్టుసమాజ స్థాపన, వాస్తవవాద, మానవతావాద దృక్పథం, సంఘప్రయోజనపరమైన కళ, శాస్త్రీయవైఖరి!

ఈ ఆశయాలు తమంత తాము మంచివే. అయితే అక్కడితోనే అభ్యుదయ రచయితల సంఘం సాఫల్యంపొందగూడదు. కాలం మారింది. మార్క్సిజం దొంగాట లాడనక్కర్లేదు. సాయుధ ప్రజాపోరాటాలకు ఆనుకూల్యం కలుగుతూవుంది. చిల్లర సంస్కరణలు ఈ వ్యవస్థను నిలబెట్టేవేగాని కూలదోసి మహత్తరమైన మరోవ్యవస్థను ఏర్పరచేవికావు. ఈ వ్యవస్థను నిలబెట్టే మాయోపకరణాలైన పార్లమెంటులాంటి సంస్థలద్వారా, దాన్ని కూలదోసే మార్పురాదు. అందుచేత విప్లవాన్ని బాహాటంగా తమ లక్ష్యంగా గుర్తించి, దీర్ఘకాలికమైన ప్రజల పోరాటాలకు ప్రోత్సాహాన్నికలిగించే విధంగా సాహిత్య సృజన చేసేందుకై, మార్క్సిజాన్ని సిద్ధాంతంగానూ కార్యచరణ విధానంగానూ నిర్ణయంగానూఅంగీకరించే రచయితలు అభ్యుదయరచయితల సంఘాన్ని

వదిలిపెట్టి బయటపడి రావలసివచ్చింది. ఒక లేఖలో కుటుంబరావుగారన్నట్లు, "అభ్యుదయ రచయితల ప్రణాళికలో ఈనాటి విప్లవ కవిత్వం ఇమిడేది కల్ల."

విప్లవ రచయితల సంఘం ఏర్పడకముందునుంచీ దాని అవసరంగురించి ఉత్తర ప్రత్యుత్తరాలలోనూ సంభాషణలలోనూ క్రమేపి ఒక గుర్తింపు కలుగుతూ వచ్చింది. విశాఖపట్నంలో శ్రీశ్రీ సన్మానం జరిగిననాటినుంచీ ఇది ఆచరణీయమైన ప్రతిపాదనగా రూపొందింది అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి శ్రీ తుమ్మల వెంకటరామయ్యగారు ఈనాడు కాదనవచ్చునేమోగాని, ఆ సంఘంలో చీలిక రావచ్చునని చాలారోజులకిందటనే ఒక లేఖలో నేను హెచ్చరించానుకూడా. "తెరవెనుక భాగవతం"లోపడి ఆయన దీన్ని ఖాతరుచెయ్యలేదు.

ఈ పరిణామంలో యువకులు నిర్వహించిన పాత్ర అత్యంత ప్రముఖమైనది. శ్రీశ్రీనిగానీ మరొకరినిగానీ "అదరించి బెదరించి లొంగదీసుకోవాలని దిగంబరకవులూ వారి మిత్రులూ చాలారోజులుగా తీవ్ర ప్రయత్నంచేస్తూ ఉన్నారు" అని తుమ్మలవారు ఒక వ్యాసంలో (విశాలాంధ్ర 13-7-70) అన్నారు. ఇది నిజంకాదన్నా వారునమ్మరు. శ్రీ శ్రీకి ఉత్తరాలు వెళ్లినమాట నిజమే. సదస్సులో పాల్గొనవద్దని పదిమందీ పది మాటలు చెప్పిందీ నిజమే. పాల్గోడానికి ఆయన తన సంసిద్ధతను తెలిపినప్పుడు శ్రీశ్రీని విమర్శించిందీ వాస్తవమే. అయితే ఇవి బెదిరింపులేనా? తుమ్మలవారు వర్ణించినట్లు, సదస్సుముందూ వెనకా అచ్చుపడివచ్చిన "రంగురంగుల కరపత్రాలు" చూస్తే, ఇవి బెదిరింపులుకావు, కర్తవ్యబోధనలని తెలుస్తుంది, అవి శ్రీశ్రీనిమాత్రమే ఉద్దేశించి చెప్పినకావు, ఈ చారిత్రకదశలో రచయితలు— ముఖ్యంగా "అభ్యుదయ" రచయితలు నిర్వర్తించాల్సిన బాధ్యతలగురించి గుర్తు చేసినవనీ తెలుస్తుంది.

"సాహిత్యం కేవలం జీవితాన్ని నిర్వచించడానికా లేక అస్తవ్యస్తమైన యీ సాంఘిక జీవితాన్ని మార్చడానికా?"

ప్రపంచానికి రకరకాల అర్థాలుచెప్పి వ్యాఖ్యానాలు చేసే ఫిలోసఫర్లకూ, ప్రపంచాన్ని మార్చజూచిన మార్క్సుకూఉన్న భేదంలాంటిదే, అభ్యుదయ రచయితల సంఘం ఆశయాలకూ విప్లవరచయితల సంఘం ఆశయాలకూ మధ్యగలభేదం. కాలతోబాటు నడవలేకనే అభ్యుదయ రచయితలసంఘం వెనుకబడిపోయింది. జాతి జీవనగమనాన్ని ప్రగతి మార్గాన్ని నిర్దేశించవలసిన రచయితలు "ఎటువైపో తేల్చుకోవాలి, తమకమిట్‌మెంట్ ప్రజాపక్షం అనిరుజువుచేయాలి" అభ్యుదయ సాహిత్య సదస్సు కార్యదర్శి శ్రీ రాంభట్లకృష్ణమూర్తిగారికేమో, "కమిటెడ్ అయినవాడు కవెలా అవుతాడు?"అనే

శంక పట్టుకొని వేధిస్తున్న తరుణంలో, సాహిత్యంతో నేరుగా సంబంధంలేని యువకులు రచయితలకు— 'అభ్యుదయ' రచయితలకు?— కమిట్‌మెంట్‌గురించి గుర్తు చేయవలసివచ్చింది. కాల వైపరీత్యంఅంటే ఇదే.

రాజకీయానికీ సాహిత్యానికీ సంబంధమేమిటని 'కమ్యూనిస్టు' నామధారులు సవాలు వేస్తున్నకాలం దుష్కాలమేమరి! రాజకీయాలకు "అతీతంగా" సాహిత్యాన్నీ, తదితర భావవిశేషాలనూ దర్శిస్తున్న ప్రబుద్ధులుగోదా "మార్క్సిస్టుల"మనే అంటున్నారు. సాంఘికవ్యవస్థకుగల ఆధారపీఠమూ, దానిపై లేచే కట్టుబడీ ఒకదానినొకటి ప్రభావితంచేస్తాయన్న పాఠంకూడా మరచిపోయారు. జాతి జీవితానికి ప్రధానరూపాలలో ఒకటై, వర్గపోరాటానికి బాహిర రూపమైన రాజకీయాన్నీ, జాతిని ఉత్తేజితం చెయ్యగల సాహిత్యాది కళాప్రపంచాన్నీ విడదీసి తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం అంటున్నారు. అందుకనే వీళ్లు "కుహనా" మార్క్సిస్టులూ, "కుహనా" అభ్యుదయవాదులూ అయ్యారు. ఆచెట్టుపేరుచెప్పుకుని కాయలమ్ముకుంటూ ఉండగోరుతున్నారు. యువకులకు ఉన్నపాటి జ్ఞానమైనా వీళ్ళకు లేకపోయింది.

ఈ పెద్దమనుషులు నిర్వహింపజూచిన "అభ్యుదయ సాహిత్య సదస్సు" అభ్యుదయ సాహిత్య సంప్రదాయానికి తలకొరివి పెట్టగోరినందుచేతనే విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. లేకుంటే ఈ సంఘస్థాపన ఇలా ఇప్పుడు జరిగివుండేదికాదు. 'లింక్' పత్రికలో రాసినట్లు (12-7-70) ఇది deliberately timed to achieve sensationel publicity కానేకాదు. సమయం విషయంలో మాకు గత్యంతరమే లేకుండా చేసినవారు అపతలివాళ్లే. వాళ్ల పాచిక పారనివ్వకుండా చెయ్యగలిగామంటే, వారి దుష్టపన్నాగంగురించి అక్కడికి అక్కడైనా శ్రీశ్రీకి నచ్చజెప్ప గలిగినందుచేతనే. శ్రీశ్రీ "అవకాశవాది"అని నోరి నరసింహశాస్త్రి నోరు పారేసుకుంటే (ఆంధ్రప్రభ 8-7-70) ఏమాయె? శ్రీశ్రీ "అవకాశవాదం" స్వలాభపరాయణత్వంకాదు ఆయన తీసుకొన్న నిర్ణయం ముళ్ళకిరీటంలాంటిబాధ్యత దాన్ని ఆయన మద్రాసులో ఉండగానే గుర్తించాడు: "ఈనాడు నేనోవ్యక్తి మాత్రుణ్ణికాదు. ఒక మహోద్యమానికి ప్రతినిధిని" (ఆంధ్రప్రభ: సంపాదకీయలేఖ 4-7-70)

ఇది చారిత్రక మహోద్యమంలో సమకాలిక సాహిత్యఘటన. 'అభ్యుదయ' శబ్దమే అపహాస్యంపాలైన సమయంలో సోషలిస్టు విప్లవ గమ్యాన్నీ, ప్రజాపోరాట మార్గాన్నీ ఎన్నుకొనే రచయితలు వేరేదారి చూచుకొన్నారు. మార్క్సిజంపట్లనూ, విప్లవ కార్యాచరణపట్లనూ అకుంఠిత మైన విశ్వాసంగల రచయితలు, ప్రస్తుతానికి తమ మధ్య ఉండక తప్పని ఎన్నో సూక్ష్మభేదాలను అడుక్కి తోసివేయగల భావైక్యతను

మార్క్సిస్టు అవగాహన వాళ్లకు కలిగిస్తుంది. శ్రామిక నియంతృత్వంవైపూ, వర్గ రహిత సమాజస్థాపనవైపూ— అంటే, సమూల విప్లవసాధనవైపు— సంకల్పపూర్వకంగానూ చైతన్యయుతంగానూ నడిచేసాంఘిక మహాశక్తుల పోరాటాలన్నిటినీగురించి అభినందించి, సహకరించేవిధంగా సాహిత్యం పరివర్తనంచెందడమే. విప్లవ రచయితల సంఘం ఆశయం ఇది ప్రధానంగా సాంస్కృతికసంస్థ, రాజకీయకార్యాచరణతోటి దీనికి ప్రత్యక్షసంబంధంలేదు.

విప్లవ రచయితల సంఘం ఒక చారిత్రక అవసరమైంది. అభ్యుదయ రచయితల సంఘపు డొల్లను చీల్చుకొని రాకతప్పదు. ఆ డొల్లకింకా నైవేద్యాలిచ్చేవారిని, దాన్ని తెగమెచ్చుకొనేవారిని, మెచ్చుకోనిద్దాం. దాన్ని నిన్నమొన్నటివరకూ ఈసడిస్తూ వచ్చిన వాళ్ళను అందులోచేరి పూలమాలలు వేయించుకోనిద్దాం.

"అభ్యుదయ కవిత్వం ఆంధ్రదేశంలో తనపాత్రను నిర్వహించి తెరవెనక్కి తప్పుకుంది. ఇప్పుడు కొత్త శక్తులు పెరుగుతున్నాయి. కొత్త మంటలు రగులుతున్నాయి. అభ్యుదయ కవిత్వం యిన్ వెస్టెడ్ ఇంటరెస్ట్ కాకూడదు." అభ్యుదయ రచయితల సంఘానికి ఇప్పుడు మిగిలిందల్లా 'అభ్యుదయ' శబ్దంఒక్కటే. దానితో ఆ సంఘ ముఖ్యులు ఇకముందు ఏపేచీలేకుండా వ్యాపారంచేసుకోవచ్చు. దాని జీవసారంమట్టుకు వేరొక సంస్థలోకి వచ్చి చేరింది. శ్రీశ్రీ, కుటుంబరావుగార్లులేని 'అభ్యుదయ' రచయితల సంఘం నిజంగా 'అభ్యుదయ' రచయితల సంఘం ఎలాగౌతుంది? హైదరాబాదునుండి అభ్యుదయ రచయితల సంఘంపేరిట విడుదలచేసిన కరపత్రంలో సంతకాలుచేసినవాళ్ల పేర్లనుబట్టిచూస్తే దాని 'అభ్యుదయం' తెలుస్తుంది. సర్వశ్రీ పురిపండా అప్పలస్వామి, విద్వాన్ విశ్వం, సి. నారాయణరెడ్డి, అనిశెట్టి, ఆరుద్రగార్లతోపాటు, సోమసుందర్, తుమ్మల వెంకటరామయ్య, ఏటూరి బలరామమూర్తి, నిడమర్తి ఉమారాజేశ్వరరావు, బొల్లిముంత శివరామకృష్ణ, రాంభట్ల కృష్ణమూర్తిగార్లు అందులో ఉన్నారు. ఒకరిద్దరు మంత్రులూ ఉన్నా ఆశ్చర్యపడవలసిన పనిలేదు. వీళ్ల సారథ్యములో, 'కమ్యూనిస్టు'పార్టీ సాచివ్యంలో, అభ్యుదయ రచయితల సంఘం మళ్లీ పని చేస్తుందట! చూద్దాం. విప్లవ రచయితల సంఘం పొడిచిన పొడుపుతో ఈ ఎత్తుబడిన పసరం ఒక అడుగు ముందుకువేసినా తూలి కళ్లకైపు క్రమ్మి మరో రెండడుగులువెనక్కు వేసి కూలబడక తప్పదు. దానికి భవిష్యత్తులేదు. ఉగాదులూ ఉషస్సులూ ఉండవు. ఎందుకంటే, అది వెనకదారి పట్టింది.

విప్లవ రచయితల సంఘం సుసంఘటితంకావడంకూడా కష్టసాధ్యమైనట్టి విషయమే. సభ్యత్వం మొదలుకొని ప్రణాళికవరకూ ప్రతిదీ కఠోరమైన తపస్సులాంటి

పనే. సభ్యులలో ఏకాగ్రత రావడానికి మరింతకాలం పడుతుంది, తప్పదు. చిన్నతనపు చిలిపిచేష్టలకూ దురుసుమాటలకూ కాలం కాదిది. బాధ్యత పెద్దది, వివేచన అవసరం. సంయమనం అంతకంటేను. అయితే రాజీపద్ధతి అనవసరం. నిజాన్ని వెల్లడించడంలో నిర్భయవైఖరి గురించి మన ప్రకాశిక స్పష్టంచేసింది. నిర్భయవైఖరి అంటే మోటుదనంమాత్రంకాదు. కరకు కోల్పోకుండానే మనం రాయవచ్చు. మార్క్సిజాన్ని సిద్ధాంతంగా ఆమోదించినప్పుడే మనబాధ్యత ఇనుమిక్కిలిగా పెరిగింది. ఒకరౌనన్నా కాదన్నా అది మనకు జీవగర్ర. ఎవరిలిబ్బీకానది. వాళ్లు పదిలంగాదాచుకొని మరొకరికి పాలివ్వం పొమ్మనేందుకు. అది ప్రపంచప్రజలసొత్తు. పార్టీల, సిద్ధాంతవేత్తల, ఖజానాలోనూ జనానాలోనూ అది బందీకాదు. కాబట్టి మార్క్సిస్టు అవగాహనను పెంపొందించుకొంటూ వర్గదృష్టిని అలవరచుకోవడం ప్రస్తుతానికి మనమొదటికర్తవ్యమని నేననుకుంటున్నాను. ఇలా చేయగలిగినప్పుడు మనం సృష్టించే సాహిత్య స్వభావంలోనే గుణాత్మకమైన మార్పు ఏర్పడుతుంది. అప్పుడే మన సాహిత్యం ప్రజల చేతి కత్తిగానూ ప్రజల కంటిచూపుగానూ పరిణమించగలదు.

— కె. వి. రమణారెడ్డి.

## ఈనాటి రచయితలకు కొన్ని సవాళ్ళు:

...కసాయివాడు జీవకారుణ్యంమీద సెమినార్ పెడితే భూతదయ కలవాళ్లు ఉరకటమేనా!

* * *

హ్యూమన్ (మానవతావాద) అండ్ రియలిస్టిక్ (వాస్తవికతావాద) దృష్టి (రాతల్లో) ఉన్నంతకాలం ఏమి ఉద్ధరింపు జరిగింది?

—కొడవటిగంటి కుటుంబరావు.

# సాహిత్యంలో విప్లవోద్యమం

దేశం స్వతంత్రమైనాక సాహిత్యమైతే పెరిగిందిగాని, తెలుగులో సాహిత్యోద్యమం సన్నగిల్లి, క్రమంగా నశించింది. కవులూ, కథకులూ, నవలాకారులూ సొంత దారులు వెతుక్కున్నారు. అయితే వారిలో అభ్యుదయసాహిత్యోద్యమం ప్రభావంపడిన వారు "సరదా"కి రాసేవారికన్న మేలైనసాహిత్యం సృష్టించారు. వారు అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యులై ఉండినా ఉండకపోయినా అభ్యుదయ రచయితలే. మార్క్సిజం తెలుసుకున్నా, తెలుసుకోకపోయినా మార్క్సిస్టు దృక్పథంకలవారే. ఈ రచయితలలో కొందరు యువకులు అభ్యుదయ రచయితలసంఘం అవతరించేనాటికి పుట్టనుకూడా లేదు. అటువంటి రచయితలను కొంతమందిని నేను స్వయంగా ఎరుగుదును.

అభ్యుదయ రచయితలకింద చెప్పుకోదగ్గ చలామణి అయే వారందరూ మార్క్సిస్టులై ఉండాలని చాలాకాలంక్రితం స్థూలంగా అనుకున్నాం. అవసరంలేదన్న మాట ఈనాడు వినిపిస్తుంది. కమ్యూనిస్టులమని చెప్పుకుంటున్నవారుకూడా ఈమాట అంటున్నారు. దానికి వారు చెప్పే కారణం ఏమిటంటే, అనాదిగా అభ్యుదయరచనలు ఉంటూనే ఉన్నాయని. నిజమే, వేమన తన కాలపు జీవితాన్ని విమర్శిస్తూ పద్యాలు చెప్పటానికి మార్క్సిస్టు కావలసిన అవసరం లేకపోయింది. కాని ఈనాడు అభ్యుదయ రచనలు చేసేవాడు మార్క్సిస్టు, లేక మార్క్సిస్టుదృక్పథంకలవాడు, కావటం తప్పని సరికదా? 'మార్క్సిస్టు కానక్కరలేదు' అన్నమాటలో 'మార్క్సిస్టు వ్యతిరేకిఅయినా యిబ్బందిలేదు' అన్న భావం ఇమిడిఉన్నదా, లేదా? "మార్క్సిస్టు కానక్కరలేదు; మార్క్సిస్టు వ్యతిరేకి కాకపోతేచాలు" అనేపక్షంలో మార్క్సిస్టూకాక, మార్క్సిస్టు వ్యతిరేకీ కానివాడు ఏమిటవుతాడు? ఊహకు అందటంలేదు.

ఇందులో అనేక అర్థాలకు తావు కన్పిస్తుంది. "మార్క్సిస్టు కాకుండానే అభ్యుదయ రచయిత కావచ్చు" అన్న వారిలో కొందరి ఉద్దేశం, మార్క్సిస్టు వ్యతిరేకులు కూడా అభ్యుదయ రచనలు చేయవచ్చుననికావచ్చు: మరికొందరి ఉద్దేశంలో మార్క్సిస్టులంటే కమ్యూనిస్టులని కావచ్చు— కమ్యూనిస్టు కానివాడుకూడా అభ్యుదయ రచయిత కావచ్చుననికావచ్చు. ఈరెండో అభిప్రాయంతో ఎవరికీ పేచీవుండనవసరంలేదు.

అయితే కొందరు అభ్యుదయ రచనలకూ, అభ్యుదయ రచయితలకూ తేడా చూడటంలేదు. "శ్రీశ్రీ 'మహాప్రస్థానం'రా సేనాటికి మార్క్సిస్టుకాడు" అంటున్నారు. ఆనాడు శ్రీశ్రీ తాను అభ్యుదయ రచయితననీ చెప్పుకోలేదు. అభ్యుదయ రచయితల మనిగాని, మార్క్సిస్టులమనిగాని చెప్పుకోని వారుకూడా జీవితాన్ని సరిగా అవగాహన చేసుకున్న మేరకు అభ్యుదయ రచనలు చేయవచ్చు. కాని అటువంటివారు రేపు అభ్యుదయ రచన అనిపించుకోనిది చేయవచ్చు. అభ్యుదయ రచయితలు తప్ప అభ్యుదయ రచనలు చేయలేరనీ, అభ్యుదయ సాహిత్యసృష్టి వారి గుత్తాధికరమనీ ఎవరూ, ఏనాడూ అని వుండలేదు. అభ్యుదయ రచయితను అని చెప్పుకుంటూ అభ్యుదయ సాహిత్యోద్యమంలో ప్రవేశించిననాడు కనీసం అభ్యుదయ వ్యతిరేక రచనలు చెయ్యకుండా ఉండగలందులకైనా మార్క్సిజం తెలుసుకునిఉంగటం అవసరమంటే అందులో ఆక్షేపించటానికేమున్నదో నాకు తెలియటంలేదు.

మార్క్సిజముకూ, మంచి సాహిత్యానికీ ఏమీ సంబంధంలేదని వాదిస్తూ "మంజువాణి" పత్రిక. శ్రీశ్రీ కుటుంబరావుల ఘనత వారి సాహిత్యంలో ఉన్నదిగాని వారి మార్క్సిస్టు దృక్పథంలో లేదని రాసింది. సాహిత్యానికి టెక్నిక్ ప్రధానమనే వారందరిదీ ఇదే వాదం. శ్రీశ్రీ రాసినా, కుటుంబరావు రాసినా మార్క్సిస్టు అవగాహనతో కూడుకున్న రచనలే అందరికీ నచ్చాయి. అవే ఇతర భాషలోకి తర్జుమా అయాయి. సరదాకి రాసినవి మర్నాడే గాలికి కొట్టుకుపోయాయి.

అభ్యుదయ సాహిత్యోద్యమం సాధించిన సత్ఫలితాలు ఈనాటికీ కనిపిస్తూనే ఉన్నాయి. వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి త్రయానికి ఈనాడు చాలా గణన వచ్చింది! అందుకుగాను అభ్యుదయ సాహిత్యోద్యమం చేసిన కృషి అమూల్యమైంది. ఆనాడు ఉద్యమం చల్లిన భావబీజాలు ఇప్పటికింకా మొలకెత్తుతూనే ఉన్నాయి. అభ్యుదయ సాహిత్యోద్యమం ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక big leap forward సాధించి, అంతరించి పోయింది. అటు తరువాత సాహిత్యోద్యమం అంటూలేదు.

ఈ పరిస్థితిలో ఆకస్మికంగా హైదరాబాద్‌లో అభ్యుదయ సాహిత్య సదస్సు ఏర్పాటయింది. ఏర్పాటు చేసినవారూ, కార్యభారాన్ని మోస్తున్నవారూ, ఆధ్వర్యం వహిస్తున్నవారూ అభ్యుదయ సాహిత్యోద్యమంతో హిస్టారికల్‌గా గాని, స్పిరిచువల్‌గా గాని ఎలాటి సంబంధమూ కలవారుగా కనిపించలేదు "విశాలాంధ్ర" గ్రూపు మాజీ అభ్యుదయ రచయితల సంఘ సభ్యులు అందులో పాల్గొంటున్నారు. అయితే వారితో బాటు అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని వ్యతిరేకించేవారూ అందులో పాల్గొంటున్నారు.

ఇలాటి సన్నివేశం 1947లో మద్రాసులో జరిగింది. అక్కడ జరిగిన అభ్యుదయ రచయితల మహాసభ ప్లాట్ ఫాం అభ్యుదయ వ్యతిరేకులకు ఇవ్వబడింది. అది చాలా విషాదకరమైన సంఘటన. తిరిగి అలాటి విషాదకర సంఘటనకు హైదరాబాదులో ప్రాతిపదిక ఏర్పడింది.

ఈ సదస్సుతో తిరిగి సాహిత్యోద్యమం ఆరంభమవుతుందని నేను తలచలేదు. అందుచేత నేను అందులో పాల్గొనలేదు. ఆ సదస్సుకు హాజరై, ఆ వేదికమీద నిలబడి కొత్త ఉద్యమం ప్రారంభం కావటానికి తగిన దోహదంచేసే శక్తులు నాదగ్గర ఉన్నాయని నేననుకోలేదు. అయితే నేను సదస్సును బహిష్కరించుతున్నట్టు ఎవరికీ చెప్పలేదు. అయినా, ఇంకా సదస్సు చాలా రోజులుండగానే కొందరు ఆహూతులకు, నేను సదస్సుకు ఎందుకు వెళ్లటంలేదో వివరించవలసిన అవసరం ఏర్పడింది. నేను వెళ్ళటంలేదని మానుకున్నవాళ్లు ఒకరిద్దరు మించరనుకుంటాను. దిగంబర కవులూ, వరవరరావూ మరి కొందరూ తాము సదస్సును బహిష్కరిస్తున్నట్టు పత్రికలో ప్రకటనకూడా చేశారు. శ్రీశ్రీ, రమణారెడ్డిగార్లు, నేను వెళ్లకపోవటానికి కారణాలు తెలిసికూడా హైదరాబాదు వెళ్లారు. వాళ్లు సదస్సును బహిష్కరించే ప్రేరణ దిగంబర కవులనుంచి వచ్చినట్టు కనబడుతుంది.

హైదరాబాదు "అభ్యుదయ సాహిత్య సదస్సు" ప్రత్యక్షంగా సాహిత్యోద్యమాన్ని ప్రారంభించలేకపోయినా పరోక్షంగా ప్రారంభించి ఉండటం చిత్రం. విప్లవ రచయితల సంఘం ఏర్పడింది.

"విరసం" రాత్రికి రాత్రే ఆవిర్భవించినట్టు పత్రికలు రాశాయి. కాని ఇది నిజంకాదు. దీనికి ముందు చాలా ఆలోచనా, సంప్రతింపూ ఉన్నాయి. విశాఖలో జరిగిన శ్రీశ్రీ సన్మానంతో ఈ సంప్రతింపులు ఆరంభమయాయి. ఆ సన్మానంలో వివిధ రచయితల పరిణామస్థాయిలేగాక, తెలుగు యువకులలో సాహిత్యానికున్న రెస్పాన్స్‌కూడా చాలా స్పష్టంగానే తెలియ వచ్చింది. ఈ యువతరం ముందుకువచ్చి "సరస శృంగార" కవిత్వం చదవటానికి ఎంత మాత్రమూలేదు. శ్రీశ్రీ సన్మానానికి వచ్చిన కవులలో దిగంబర కవులు (జ్వాలాముఖి, నిఖిలేశ్వర్) అవలీలగా ప్రాముఖ్యం సంపాదించుకున్నారు.

అసలు సంగతేమిటంటే, "విరసం" పుట్టక పూర్వమే విప్లవ-తిరుగుబాటు కవిత్వం పుట్టింది: ప్రతి ఘటనను ఎదుర్కొన్నది; ప్రచారం అయింది. దిగంబర కవిత్వం కవిత్వమవునా కాదా, వాళ్లువాడే అశ్లీలాలు గర్హ్యమైనవా కావా-ఇలాటి

సమస్యలు చాలా బయలు దేరాయి. కాని అందులో కాల ప్రభావమూ, ఒక విధమైన సామూహిక లక్షణమూ ఉండటంచేతనే దిగంబర కవిత్వానికి ప్రచారం ఏర్పడిందన్న సంగతి చాలామంది గుర్తించలేదు.

దిగంబరకవులు ఆధునిక కవిత్వంలో ఒక కొత్తదారి చూపారు. ఈ దారిలోనే వచ్చారు 'తిరుగబడు' కవులు. వీరూ, వీరి కవిత్వాన్ని అభిమానించే యువతరం వాళ్లూ విప్లవ సాహిత్యోద్యమం రావాలని కాంక్షించటం స్వాభావికం. వీరు శ్రీశ్రీని తమకేసి లాక్కోవటం ఎంత మాత్రమూ అస్వాభావికంకాదు. ప్రపంచాగ్నికి తాను సైతం సమిధ నొక్కటిఆహుతిచ్చిన శ్రీశ్రీ ఈ యుగానికి ఆదివిప్లవకవీ, తిరుగుబాటు కవీనూ. అందుచేతనే విప్లవ–తిరుగుబాటు కవులు అతన్ని వదులుకోలేదు; అతను వాళ్ళవెంట నడవకుండా ఉండలేదు.

నేను ఇందులోకి ఎలావచ్చానో చెప్పటం అవసరం. నేను "విప్లవ" కథలు రాసినవాణ్ణికాను. దిగంబరకవులను సీరియస్‌గా పరిగణించినవాణ్ణికాను. నేను దిగంబర కవిత్వం చదివినంత మేరలో వాళ్లు దేశపరిస్థితులను ద్వేషించటమూ, తమ ద్వేషాన్ని సాధ్యమైనంత మొరటుగా, ప్రోవొకేటివ్‌గా వ్యక్తంచెయ్యటమూమటుకే కనబడింది. దిగంబర కవిత్వాన్ని సీరియస్‌గా తీసుకున్నవాళ్లు కొందరు ఆ కవిత్వంగురించి నా అభిప్రాయం అడిగితే, "వాంతిచేసుకునేవాణ్ణిచూసి యితరులు వాంతిచేసుకోరు. వాళ్లు ద్వేషించేదంతా నేనూ ద్వేషించేదే, కాని దిగంబరకవులు ఈ ద్వేషాన్ని ప్రజలలో పుట్టించటం అవసరం"అని చెప్పాను:

కాని దిగంబరకవుల మూడోసంపుటిలో కొన్నిరచనలు చెరబండరాజువి చూశాక దిగంబర కవిత్వంమీద గట్టిఅభిప్రాయం ఏర్పడింది. ఇది నిజమైన విప్లవ-తిరుగుబాటు కవిత్వం. ఇది పాతకవిత్వాలను ఔటాఫ్‌డేట్ చేస్తున్నది. అంతకన్న ముఖ్యం-నాకు సంబంధించినంతవరకు- ఏమిటంటే, ఈ కవిత్వం ప్రజలకు ఈనాడు అవసరం.

అయిదారేళ్ళక్రితమే నాకు నారచనలవల్ల ప్రయోజనం ఉంటుందన్న విశ్వాసం పోయింది. రాయటం మానేశాను. కాని కొన్నిపత్రికలు నాచేత బలాత్కారంగా రాయించాయి. నా రచనలో నాకు విశ్వాసంలేకుండా చేసినది దేశపరిస్థితి. పాలకవర్గం తన లక్ష్యంఏదని చెప్పినా, అది ధనికవర్గాలపక్షానే పరిపాలన సాగిస్తున్నది. ప్రభుత్వ తుపాకులు ధనికులకు అంగరక్షలు. పేదలస్థితి స్వాతంత్ర్యానంతరం మరింత అధ్వాన్నమయింది. కొద్దిమంది కోటీశ్వరులకుమాత్రమే నిజమైన స్వాతంత్ర్యం వచ్చింది. కొత్త సామ్రాజ్యవాదం దేశంలో బాగా వేళ్లు తన్నుతున్నది. మతమౌఢ్యాన్ని ప్రభు

త్వమే పాలుపోసి పెంచుతున్నది. డెమోక్రసీఅని రాజకీయవాదులు రొమ్ములువిరుచుకుని ఏంలాభం? ప్రజలు ఎన్నుకున్నవాడు తనపార్టీ మార్చడని గ్యారంటీలేదు. ప్రజలు వోటు వేస్తున్నది పార్టీకా? వ్యక్తికా? ఎన్నుకోబడ్డవాడు పార్టీమార్చితే వాడి ఎలక్షను ఎందుకు రద్దుకాదు? ఇదేం డెమోక్రసీ? ప్రజలు వోటుచేసేది వ్యక్తికే అయితే పార్టీ టిక్కెట్లు ఎందుకు?

ఇంతపెద్ద దేశాన్ని పరిపాలించే పద్ధతి ఫార్సుకన్న హీనంగా తయారయింది. ఈ ఫార్సులో పాల్గొనే రాజకీయ పార్టీలన్నీ బఫూన్‌పాత్రలు వహిస్తున్నట్లు నాకు అనిపించింది. ప్రజలు ఈ పరిస్థితిమీద తిరగబడతారు— కాదు తిరగబడాలి.

తిరుగుబాటు నక్సల్బరీలో ప్రారంభమయింది. ఇతర ప్రాంతాలకు పాకుతున్నది. నక్సల్బరీ తిరుగుబాటు జరిగినప్పుడు దాన్నిగురించి యెవరో నా అభిప్రాయం అడిగితే, ఒకటికాదు. దేశంలో నూరు నక్సల్బరీలు రాబోతాయిఅని జవాబురాశాను, నేను అప్టే పొరబడలేదు.

ఈ తిరుగుబాటు భూస్వాములమీదా, పరమ కిరాతకులైనవారి దారుణాలమీదా. కాని ఈ భూస్వాములను పాలకవర్గం అదుపులో ఉంచదు: ఎందుకంటే, పవిత్రమైన ఈ గాంధీగారి పార్టీవారికి యీ హంతక కిరాతకులఅండ అవసరం. గిరిజనులకూ, ఆదిమజాతులకూజరిగే అన్యాయాలనుగురించి పార్లమెంటులో మొసలికన్నీళ్లుకార్చటమూ వారిని వధచెయ్యటానికి తుపాకులవాళ్లను పంపటమూనూ!

ఇప్పుడు దేశంలో సాగినదాన్ని నేను విప్లవంగా భావించటంలేదు. అది తిరుగుబాటే. కాని ఈతిరుగుబాటును ప్రజాబాహుళ్యం అర్థంచేసుకొని బలపరిచేనాటికి విప్లవం వచ్చి తీరుతుంది. విప్లవంగురించి అందరూ మాట్లాడుతున్నారు. ఇందిరాగాంధీగారు విప్లవానికి తన నిర్వచనం యిటీవల యిచ్చారు. కాంగ్రెసుపార్టీవారి సోషలిజం నిర్వచనంలాగే ఉన్నది ఈ విప్లవ నిర్వచనం.

విప్లవం రాకుండానే దేశపరిస్థితి చక్కబడుతుందని అమాయకులు నమ్మవచ్చు మోసగాళ్ళు నమ్ముతున్నట్టు నటించవచ్చు. కానీ పాలకవర్గమూ, అది సంరక్షిస్తున్న ధనికవర్గమూ విప్లవం వస్తుందనినమ్మి, దాన్ని అణచటానికీ, మొగ్గలోనే తుంచెయ్యటానికి చేయదగినదంతా చేస్తున్నది. రాబోయే విప్లవానికి యెదురుగా ఇప్పటినుంచే బారుచేసిఉంటే, సాయుధవిప్లవం కాక ఇంకేమిటివస్తుంది? దిగంబరకవులు సాయుధ విప్లవం అన్నారని ఉలిక్కిపడటందేనికి? విప్లవంరాకుండా అడ్డుకునేవాళ్ళు మంత్రించిన

విభూతి ప్రయోగిస్తున్నారా? తిరుగుబాటును నడిపించే నాయకులు ఒక్కొక్కడూ చచ్చిపోతున్నప్పుడల్లా బూర్జువాపత్రికలు పండుగచేసుకోవటంలేదా?

ఇంకొక్క విషయం ప్రస్తావించి యీ వ్యాసం ముగిస్తాను. విప్లవ రచయితల సంఘం ఒక రాజకీయపక్షాన్ని అనుసరించి వెళ్ళటానికి నాకు అభ్యంతరంఉన్నది. రాజకీయపార్టీలు తిరిగే మెలికలన్నీ సాహిత్యం తిరగటం సాధ్యంకాదు. వాళ్ళ స్ట్రాటజీలూ టాక్టిక్సూ వాళ్ళకేఉండనివ్వండి. సాహిత్యం ప్రజలకూ, ప్రజాజీవితానికీ సంబంధించినది. 'విప్లవ రచయితలసంఘం'అన్న పేరులో 'విప్లవం' అన్నమాట భవిష్యత్తును చూస్తున్నది. అభ్యుదయం 'విప్లవం' ద్వారానేగాని రాదని గుర్తిస్తున్నది. కాంగ్రెసులోని "అభ్యుదయ" వాదులలో ఇంకా విశ్వాసాలున్నవారు ఈకొత్త సంఘాన్ని ఆమోదించరు. విప్లవం అంటే విద్వేషమూ, భయమూ ఉండి, పోలీసు అత్యాచారాలంటే భయంలేనివాళ్లూ, పోలీసులుచేసే హత్యలను అహింసగా భావించేవాళ్లూ సహజంగా ఈ కొత్త సంఘాన్ని దుమ్మెత్తిపోస్తారు. అవి విప్లవ రచయితల సంఘానికి ఆశీర్వచనాలు.

—కొడవటిగంటి కుటుంబరావు.

# గానుగెద్దు

నేను మనిషిని
ఏ దేశంలో ఉన్నా నీకు
అన్ననో తమ్ముడినో నేను
నల్లవాడినయినా తెల్లవాడినయినా
కొల్లగొట్టేవాడిని మాత్రంకాదు
అందుకే నేను చెప్పేందివిను
గానుగెద్దువై తిరుగుతున్నంతకాలం
నూనెలో భాగం రాదని గుర్తుంచుకో
పనున్నంతకాలం దానావేసి నీ ప్రాణం
రక్షిస్తున్నాడన్న జ్ఞానం తెచ్చుకో
వాని పున్నమ కొరకు నీ బతుకు
అమావాస్య చేసుకున్నా
వాని మూడు నాళ్ళ ముచ్చట కొరకు
నీ బతుకు వెయ్యేళ్ళ భారతం చేసుకున్నా
వాని సౌఖ్యం కోసం
నీ స్వతంత్రాన్ని బలిదానం చేసినా
గంతలు కట్టుకొని బతుకంతా
తిరుగుతూనే గడిపినా
బక్క చిక్కిన నాడు బండెడు
గడ్డివేస్తాడను కోకు
నా తమ్ముడో అన్నో అనుకొని
పాకలో ఉండనిస్తాడనుకోకు
శ్రమను అమ్ముకొని జీవించినవాడు
నీ శరీరాన్ని అమ్ముతాడన్న జ్ఞానం తెచ్చుకో

—పురుషోత్తం.

# రెండు కవితలు

## 1

కదుల్తున్న కాలాన్ని
కాంతిదిశకు నడపాలని
అన్యాయంగా సాగిపోతున్న
దోపిడీ సంఘాన్ని రూపుమాపాలని—
క్షణక్షణానికి మారుతున్న మానవుల
వింతమన స్తత్వాలను మానవాభ్యుదయ
మనుగడవైపు మరల్చాలని
అనుదినం అధికారం పెంచుకుంటూ
అహంతో విర్రవీగుతున్న పెత్తందారీ ఆర్థిక సమాజాన్ని
కూకటివేళ్ళతో కూల్చాలని—
బ్రతకటం చేతకాక వంచనతో
అణగారినఅన్నలకు—తమ్ముళ్ళకు
నిజమైన బ్రతుకుబాటను చూపాలని—
కుయుక్తులతో యుక్తిపరులమంటూ
భుక్తికోసం భక్తి నటిస్తూ ఆత్మవంచన చేసుకునేవాళ్ళకు
లుకలుకలాడే ప్రతిష్ఠాపీఠం కూలిపోతున్నదని చెప్పాలని
మానవత్వాన్ని వ్యక్తంచేయనీయకుండా
వ్యక్తిత్వాన్ని మరుగు పరుస్తున్న సామాజిక
విలువలను సమూలంగా మార్చాలని
రాజకీయ కర్కషత్వంలో
నలిగిపోతున్న శ్రమ జీవులకు
సమసమాజపు చిరస్వప్నం చూపాలని
నిరాశతో నిస్సారంగా
బ్రతుకులు సాగిస్తున్న జీవితాలకు
సూర్యకాంతిలాంటి భవితవ్యముందుందని
మరీమరీ చెప్పాలని మనసులువిప్పాలని—

## 2

వంచన అంచునే
ఈనాడు సౌఖ్య సౌధం లేస్తున్నది
లంచం పంచనే
ఈనాడు అశ్వమేధం జరుగుతున్నది
జీవితాన్ని వివేచనతో
సామాజిక వేదనతో చూసినపుడు
నాలో ముసురుతున్నవి
మునుపెన్నడు కలుగని బాధలు
కసురుకున్నవి
అసహాయ జాతిని పీడించే జాతిని.
అలసటతో క్రుంగిపోయిన హృదయం
ఆక్రోశంతో ఒళ్లు విరిచింది.

—ఏబసలింగప్ప.

# ఒకఅంచు కలం, ఒకఅంచు కత్తి

వాడిన ఆశయాలు
మోడు వారిన ఆదర్శాలు
మళ్ళీ చిగిర్చేలా,
నిండా అలుముకున్న
నిర్వీర్యతా, నిస్తేజతా వలిచి,
చెదలుపట్టిన ఆలోచనలను దులిపి,
బానిస భావాలతో
జాతిని కలుషితం చేసిన
పాత ముఖాల రాతలుచెరిపి
వాడైన కత్తితో తిరిగి చరిత్ర రాస్తున్నాను
నా అక్షరాలు విప్లవ గర్భాలు.

—శ్రీభాష్యం.

# సాక్షిగా నేనక్కడే ఉంటాను

మిత్రమా ?
నీ కెందుకంత కోపం
నిన్నెవరడిగారీలోపం
తొంబదితొమ్మిదికి నూరోపైస కావాలని
గుడ్డివాడి గిన్నెలోని
ఎర్రఏగాని తీసావని-
పసిబిడ్డ ఎండిన ఒంటికి
పదిచుక్కలు పట్టించాలని కొన్న నూనెలో
పదోచుక్కను పదిలంగా
పావులోనే ఉంచుకున్నావని-
వద్దంటేవచ్చే
బాలెంత రోగానికి
నువు సూదితో యిచ్చింది
డిస్టిల్డువాటరేనని-
ఆకలితో మాడి జీరబోయిన
కంఠంతో కేకేసేవాడికి
పట్టెడన్నం పెట్టేకంటే
కొవ్వుపట్టిన కుక్క
కేస్తే బాగనుకున్నావని
నిన్నెవరడిగారని
అప్పుడే యీ ఉలికిపాటు
బక్కచిక్కిన శరీరాలు
ఎండిపోయిన ఎముకలు గూళ్ళు
నిత్యం నీచే పీడింపబడేవాళ్ళు
మండిపోయే ఎండలో

ఎముకలు కొరికే చలిలో
హోరుమనే వానలో
ఎండీ, తడిసీ, వణికీ
పండించిన ఫలితాన్ని నీకిచ్చి
"కర్మ"అని కంటనీరు పెట్టేవారు
నిలదీసి నిన్ను ఒకరోజు
నీచేష్టలకు ప్రాయశ్చిత్తం చేస్తుంటే
సాక్షిగా నేనక్కడే ఉంటాను.

—"బుజ్జి"

# మీకు తెలియదు

మా ఆశల్ని
ఉరికంబా లెక్కించి
చప్పట్లు చరుస్తున్నారు.
మా కన్నీటితో
మీ దాహం తీర్చుకుంటున్నారు.
కొండ క్రింద
మోడు చెట్ల బీడు లాటి
మా జీవితం
మీ సుఖానికే అంకితం
మీకు తెలియదు
మా కళ్ళలో కన్నీటితో పాటు
కణకణ మండే నిప్పుకణాలు దాక్కొనివున్నాయని
మీకు తెలియదు
కొండ చుట్టూ మూగిన
మంచు తెరలు కొద్దిక్షణాల్లోనే కరుగుతాయని
మీకు తెలియదు
మా స్వప్నం నిజమవుతుందని

—టి. భానుమూర్తి.

# విప్లవిద్దాం! రా!

కారాకిళ్ళీ
నములుతూన్న కిరాణకొట్టూ!
బొజ్జ తడిమి చూచుకొని
త్రేవుమంటూనేవుండు,
అమాయకుల్ని కొల్ల గొట్టి
నింపుకొన్న నీ గల్లాపెట్టి
గునపాల్తో పొడిచి లాక్కుంటూంటే
కిక్కురుమనకుండు,
తెల్లటోపీ
విషం తలతో క్రొవ్విన ఇండస్ట్రియలిస్టూ!
ప్రజలరక్తంపీల్చి నింపుకొన్న
లాక్ఛలు చూసుకొని
నవ్వుకుంటూనేవుండు,
ఎర్రబావుటా
ఎగరేస్తూ శూలాల్తో చుంబిస్తే
కదిలిపోతూన్న నేలపై
కదలకుండా ప్రాణం
వదిలిపెడ్తూనేవుండు.
కల్లిబొల్లి కబుర్ల
జనాన్ని బుజ్జగించే కార్మికనాయకా!
వాక్స్వాతంత్రానికైనా నోచుకోని
మూలకూర్చుని మురిసిపోతూవుండు.
చల్లారని ఆర్తితో
విచ్చుకత్తులు ఝళిపిస్తూన్న వీరుల్ని
నీ నీరస నాదాల్తోనైనా
ప్రోత్సహిస్తూనేవుండు.

శోషలిజం
నినాదాలతో అలసి సొలసినతల్లీ!
కల్పవల్లీ నీ పార్టీల మానసనిపుండు
గెలుస్తుందోలేదో చూస్తువుండు.
ప్రజాస్వామ్యపు
గోతుల్లోంచి గొంతుచించుకోకు!
ఆకాశ పుష్పం నీ శోషలిజం, అందరికీ తెలుసు.
ప్రేయసి చొంగను నెమరేస్తు
నిదురిస్తున్న కవివృషభమా!
కత్తిలా కలాన్ని ఝళిపించు!
లేకుంటే కలం పారేసి
నోరుమూసుకొనివుండు.

పుస్తకాల్లో
తలలు బ్రద్దలుకొట్టుకుంటూన్న నా చిట్టితండ్రీ!
నీ భవిష్యత్తు నాస్తిచేసిన వినాయకుల్ని
క్షమించకు, ఓర్పువహించకు.
పొంగుతూన్న రక్తాన్ని చిందించి
తెగబలిసిన రాజకీయ రాబందులతో
వీరపోరాటం సాగిస్తుంనేవుండు.
ఆకలికడుపుతో
అస్థిపంజరంలా మిగిలిన మనిషీ!
గోల్లిపిల్లి సారాత్రాగుతూ
పస్తులుపడుకొ్కని
పళ్ళికిలించకు, రక్తపుకన్నీళ్ళుకార్చకు.
ఆఖరి రక్తపుబొట్టు
నేలరాలేదాకా విప్లవిద్దాం! రా!
మరో ప్రపంచం చూపించే
మాన్యుడు మనముందున్నాడునడూ!

—సి. వి. రమణ.

# చెలీ! ఇప్పటికిక గుడ్ బై

టినోపాల్ చొక్కాలతో
కాలరెత్తుక తిరగడమే
ఆడవాళ్ళని ఏడిపించడమే
నాగరికతగా
తలపోసినరోజుల్లో
దేశంలోని యవ్వనం మొత్తం సాధించాలని
ప్రేమకే ఏకైకసామ్రాట్టుగా, నాపాలిటిహీరోగా
మజ్నూని పూజించినరోజుల్లో
చెలీ!
నిన్ను ప్రేమించాను-కామించాను.
నీతోకలిసి వెన్నెలరాత్రుల్ని కప్పుకున్నట్లు
గాలితో పందాలేసుకుని ఆడుకున్నట్లు
పువ్వుల్లోపవ్వళించి
నింగిన మేఘాల్ని
పొంగే అలల్నిచూస్తూ
ఊహించాను, కలలుగన్నాను,
విరహగీతాలాలాపిస్తూ
మగవాణ్ణయికూడా బృహన్నలగా బ్రతికాను.

కానీ ఈనాడు—
దేశం మొత్తం పీనుగుపెంటగా
చూడలేనంత హీనంగా, దీనంగా
అవాంఛనీయంగా, అసహ్యంగా
భయంభయంగా బ్రతుకీడుస్తున్న మనుషుల్ని
చేతికందని పంటచేలనిచూస్తూ
చేసిన కష్టాలకి ఫలితంగా

